# ఇందిరా శతకము.



గ్రంథకర్త:

అ. గు.

గోవర్ధనం శ్రీరంగాచార్యు

తాళ్లపూడి.

# మాతృస్మృతి.

మ॥ జననీ! నీదుపవిత్రసంస్మృతికి నీసద్గ్రంథమున్ భక్తితో
వినయం బేర్పడగన్ రచించునెడ నోప్రేమస్వరూపీ! మనం
బు 'నమాతుఃపరదైవతం'బనుచు నుద్బోధించుటం దొల్తని
న్మన మార న్గణుతింతు సద్గుణయుతా! మాతా! సుభద్రా

# అంకితము.

సీ. ఏసతినామంబు నాసుత కిడుటచే
మాతృసంస్మరణకు మార్గ మయ్యె
ఏసతిగర్భాన వాస మందుటఁ జేసి
నాజన్మ సఫలమై తేజరిల్లె
ఏసతిపతిభక్తి ఈశ్వరాసక్తియు
నుభయకులంబుల నుద్ధరించె
ఏసతియాకృతి హితజనాదృతి మతి
నసమానయనుచు విఖ్యాతిగాంచె

గీ. వట్టిసౌభాగ్యసౌకుమార్యావలంబ
అస్మదంబ, యనఘ, సుభద్రాంబ కాత్మ
శాంతి గల్గింప నిందిరాశతకకృతిని
నతులితానంద మొంది యంకిత మొనర్తు.

శ్రీరస్తు.

# గణేశ్వరస్తవము.



ఉ॥ శ్రీశు నిజాంశచే నుమకు జెన్నలరారగ నుద్భవించి గౌ
రీశుని ప్రేమపాత్రమయి మెల్లజగంబులలో నితండె వి
ఘ్నేశు డనం బ్రసిద్ధిగను నీప్సితదాయకు డాదిపూజ్యు డీ
శ్రీశతకక్రియాచరణసిద్ధి నవిఘ్నత గూర్చుగావుతన్.

శ్రీం శ్రియై నమః.

# ఇందిరా శతకము.

ఉ॥ శ్రీసరసీజపాణి! భ్రమరీనిభ వేణి! సుఖప్రదాయినీ!
దాసజనప్రసన్నముఖి! ధర్మవివర్ధని! మంజుభాషిణీ!
భాసురదివ్యభూషణి! కృపాపరిపూర్ణవిశాలలోచనీ!
దోసము లెంచ కమ్మ నిను దోసిలి నొగ్గి నుతింతు నిందిరా.

ఉ॥ కోరిక దీర్చుమంటి నినుగూర్మి భజించెద నంటి నింక నె
వ్వారిని వేడ నంటి శ్రితవర్గము బ్రోచెదవంచు వింటి స

త్కారముగాఁగ నేను శతకం బొనగూర్పగఁ బూనియుంటి నా
భారము నీదె సుమ్మి పరిపాలనసేయుమి తల్లి యిందిరా.

చ॥ శతకము లెన్నియో గలవు జాలవె యయ్యవి యేటి కీత డీ
శతకము వ్రాయఁబూనెనని సందియ మందకుమమ్మ లక్ష్మి యా
శ్రితులకు త్వద్గుణామృతరుచిఁ గన నీశతకంబె కాదుగా
శతశతకంబులైన నిక జాలనుపించునె తల్లి యిందిరా.

చ॥ మదిని చలత్వమో, మఱుపొ, మాంద్యమొ, భీతియొ, విస్మ
యంబొకో

ముదమున బల్కరా వెదను బుట్టుతలంపులు వ్యోమవాహినీ
సదకలుషప్రవాహపటుచంచదనర్గళవాక్యవైఖరిఁ
వదయుత నా కొసంగి నను సాకగదే ప్రియ మార నిందిరా.

చ॥ పెండగలపుష్పహారములు మేలగుకంకణముల్ కరంబులన్
దడబడ నాడు పాల్కడలి ద్రచ్చునెడన్ జగదీశుమేనికిన్
బడలిక బాప జల్లనగు వాల్గనుసన్నలు మందహాసముల్
బాడమ సుధాతరంగముల బుట్టితి వీవె గదమ్మ యిందిరా.

చ॥ సకలచరాచరప్రకర సంతత జీవనహేతుభూతవై
అకలుష నిర్వికల్ప మహిమాంచితవై శ్రితపారిజాతవై

ప్రకృతి సుజాత వై పరమపావనతన్ భువ నైకమాత వై
ప్రకటయశంబు నొందితి కదుభాసిలు నిన్ను దలంతు నిందిరా.

చ॥ అకలుషవందనార్హ మగు నంఘ్రిసరోరుహ మొందు చాపి వే
రొకపదపద్మమున్మడిచి యొప్పుగ హస్తసరోజ మానుచున్
వికచసరోజపీఠమున వేడ్క వసించెదు నీదుసత్కృపా
ప్రకట దపాంగదివ్యముఖపంకజ దర్శన మిమ్ము యిందిరా.

చ॥ అవనియు, సప్తమాతృకలు నష్టవిభూతులు, పద్మముఖ్యలా
నవనిధు లుజ్జ్వలాకృతులు నమ్రత నంజలులన్ ఘటింప మా

నివరులు లక్ష్మీసూక్తముల నిశ్చలభక్తి పఠింప నచ్చరల్
అవహితవై నటింప భువనావనవై కొలువుందు విందిరా.

చ॥ సురటిని భారతీరమణి సొంపుగ బూన నిలింపకామినుల్
వరుసలు తీర్చి ముంగల నవస్వరచాతురి మీఱ గానమా
ధురి గురియింప సేవకనతుల్గొనుచున్ గొలువున్న నిన్ను సు
స్థిరులు విధీశ్వరామరులు చేరి భజింతురు గాదె? యిందిరా.

చ॥ జయనినదంబుల న్సురలు సల్పుచుముంగలనిల్వ సంయముల్
ప్రియముగ సామగానముల వీనులవిం దొనరింప నీదు హ్రా

ద్దయ కడగన్నులన్ వెలయ దాసుల దైన్యము బోవద్రోసిని
శ్చయవిభవాదికంబుల నొసంగెద వీవె గదమ్మ యిందిరా.

ఉ॥ అంబుజపాణి వీవు హరి యంబుజనాభుఁడు శ్రీద వీ వతం
డంబరో! శ్రీధరుం డిల భవాశ్రయ వీవు భవాశ్రయుం డతం
డంబుధికన్య వీ వతఁడు నంబుధిశాయి మిము న్నుతింప శ
క్యంబె? పురాణదంపతులు గారె జగంబుల కెల్ల నిందిరా.

చ॥ సురుచిరనీలనీరదసుశోభితమైన మెఱుంగుభంగి శ్రీ
హరియురమందు రంజిలుచు నాశ్రితులన్ గరుణావిలోకనాం

కురముల బ్రోచుపాల్గడలికూతుర! నందకపాణిరాణి! యో
సిరి! కృప మద్గృహంబున వసింపు మనారత మంబ యిందిరా.

చ॥ నిను తనుజాతగా గనుట నీరధి రత్నఖనిత్వ మందదే
నిను సతిగా వరించి హరి నేర్పు వహించడె శ్రీనివాసుడై
నిను సహజాత నొందిదివి నిల్వదె కల్పక మర్థదాయియై
నిను భజియించువారల కనిష్టము లున్నవె? దేవి! యిందిరా.

చ॥ స్థిరచరరూపమౌ జగము శ్రీపతి! నీకు విలాసభూమి యౌ
పరమపదంబు నీ కునికిపట్టు, మురారి నిజేశ్వరుండు నౌ

పరయగ నాయనంతగరుడాదులు కింకరు లింక మేము న
స్థిరులము త్వత్కృపార్హుల మశేషము నీపరివార మిందిరా.

చ॥ అరయగ బంచభూతము లహంకృతి బుద్ధి హృదింద్రియాదులా
వరణచయంబు భూర్భువదివంబుల నొప్పు నజాండకోటులన్
పరుడు భవన్మనోహరు డపారరతిన్ చిదచిద్విశిష్టుడై
గురుమతి నీవిహారమునకున్ సృజియించె నిజేభ నిందిరా.

చ॥ తనరగ నామరూపరహితంబును విశ్వమయంబునైన ని
ర్గుణపరమాత్మ యాశ్రితుల గోర్కెల దీర్పదలంచి చిత్స్వరూ

పిణి! భవదాశ్రయంబున భువిన్నగుణుండయి నామరూపముల్
గని యనిశం బుపాస్యు డగుగాదె జగంబుల కెల్ల నిందిరా.

చ॥ కరణకళేబరాదులు జగత్పతిసేవకు గల్పితంబు లం
చరయక భోగశీలురగు నాత్మల నీపతి నైజమాయచే
బురుషుడు వేశ్యవేసమును బూని విటాళిని మోసగించు న
ట్లెరిగియు మోసపుచ్చు భవదీయపరీహసనార్థ మిందిరా.

ఉ॥ వారినిధిన్ మథించె మును వారిధి బ్రేమను బవ్వళించె దో
ర్వీరగభీరతన్ హరుని విల్విరచెన్ దగవార్థి గట్టె దు

ద్వారపరాక్రమక్రముని రావణు ద్రుంచె నహో మురారి నిన్
గోరికదామ జేది యొనగూర్పదు నీకొఱకంబ యిందిరా.

చ॥ జననిరో నీకు నీశ్వరుడు సర్వజగత్క్రియ లొప్పగించి దా
ననిశము సాక్షిమాత్రు డగునందు రపారము నీదుశక్తి యే
మనియెద నేస్వరూపములనైన ధరించెద వెట్టికార్యమై
నను నొనరింతు వెందు నిను నమ్మిన గోర్కె ఫలింప దిందిరా.

ఉ॥ జ్ఞానము, తేజము స్బలము, శక్తియు బ్రేమజయంబు నాశ్రితా
ధీనతయున్, పరోపకృతి, ధీరతయున్, జగదీశ్వరత్వమున్

మానితకాంతి శాంతియును మార్దవ మాదిగుణంబు లెల్ల నో
మానిని! నీకు శౌరికి సమానములై తనరారు నిందిరా.

ఉ॥ సుందరయౌవనాదిగుణశోభ సమాన మ దిర్వురందు స్వ
చ్ఛందవిరోధిశిక్షణయశస్స్థిరతాదికపౌరుషంబు గో
విందుకడన్ సతీహితవివేకమృదుత్వకృపాక్షమాళి నీ
యం దగుటన్ సతీపురుషతాహ్వయభేదము గల్గె నిందిరా.

చ॥ ఇల గలశన్ గులాలకుడు మృత్తికలేక యొనర్పలేని య
ట్లలరి భవత్సహాయమును నందక నీవిభు డీప్రపంచకం

బెలిమి సృజించునే? ప్రకృతి వీ వతడే పురుషుండు దుగ్ధమం
దలిధవళత్వముంబలె సదా వెలుగొందరె మీర లిందిరా.

ఉ॥ కోరగ రాజదర్శనము కూర్మి నమాత్యముఖానగాని చే
కూరనిరీతి నిన్ బ్రకృతి గొల్చి భవత్కృప నొందకున్న నో
క్షీరపయోధికన్య! తలక్రిందుగ నెంత తపంబు సల్పినన్
గోరిక దీర్ప నీశ్వరుడు గోచరు డౌనె జగాన నిందిరా.

ఉ॥ స్వాంతమునం ద్రియామయి బ్రశాంతబరాత్పరి నిన్నాదిమ
ధ్వాంతను సత్ప్రపంచకనియామక నీశ్వరి మూలశక్తి నిన్

శాంతముతోడ నిన్నరయు శక్తి యొకింతయు లేక ప్రాకృతుల్
భ్రాంతి దలంత్రు పాల్కడలిపట్టిరో! చంచల వంచు నిందిరా.

ఉ॥ ఈవె జగంబులెల్ల సృజియింపగ బెంప హరింప సత్ప్రభా
వావహవై చిదాకృతివియై నిజవల్లభుచిన్ సుసౌఖ్యలీ
లావహితాత్ము జేయుదు వటంచను నైగమసూక్తి వింటి నన్
గావగజాల వౌకొ త్రిజగన్నుత దివ్యచరిత్రి యిందిరా.

చ॥ బహువిధకార్యభారుడు భవత్పతి సత్వరబుద్ధితో నను
గ్రహమును జూపడన్ దలపుగల్గి నుతింపుచు నుంటి నిన్ను బ్ర

త్యాహాము ప్రోవుమమ్మ నను దద్దయుప్రీతిని దండ్రికంటె ని
మ్మహి జనయిత్రి వేమరు కుమారులనారయదొక్కొ యిందిరా.

చ॥ వినతి భవత్కృపామతము వేడెదునన్ను సమాదరంబుచే
గనక నిరాకరించినను కంజజ! నీపదభక్తి మాన నే
జనని, క్షుదార్తి జగ్గుడువసాగెడుబిడ్డను ద్రోసివేసినన్
బనివడి బ్రాకులాడుచును బాయదు మాతృపదంబునిందిరా.

చ॥ అసదృశమైనభక్తియను సాయనుపానముతో భవత్కృపా
రసమహదౌషధం బిడ తిరంబుగ మాన్పవె మన్మనోరుజా

వ్యసనములన్ భిషగ్మణి నిజౌషధ మిచ్చి రుజన్ గుదుర్చు న
ట్లెసగు ద్వాదాశ్రయంబు గన నెట్టిభయంబును గల్గ దిందిరా.

చ॥ మగనియురంబునందువనమాల భవన్మృదుళాంఘ్రియుగ్మము
ల్దగిలి నవత్వమందును సదా హిమసేచన మందినట్టు లా
నిగమనివేదితంబులగు నీదుపదాబ్జముల న్మనస్థలిం
దగ నెలకొల్పి వందనశతంబు లొనర్చెద భక్తి నిందిరా.

ఉ॥ అంగజుగన్నయమ్మ ముగురమ్మలలో తొలియమ్మ కాంతికిన్
బంగరుబొమ్మ భక్తులకు భాగ్యవిశేష మొసంగుకొమ్మ యా

రంగనిముద్దుగుమ్మ యనురాగము జూపగదమ్మ శ్రీజగ
న్మంగళమూర్తి వమ్మ యనుమాన మొనర్పక బ్రోవు మిందిరా.

చ॥ అమృతము లొల్లునీదుచరణాంబురుహద్వయి నాశ్రయించివి
భ్రమత మదీయచిత్త మితరంబును జేరగ నిచ్చగించునే
ప్రమద మొసంగుచుండుమకరందభరంబగు పద్మముండగన్
భ్రమరము గొబ్బిపూకడకు బారునె తా కలనైన నిందిరా.

ఉ॥ మాయువతుల్ తనూభవులు మాజననీజనకాది బాంధవుల్
మాయిలువాకిళ్ళు ల్ష్మడులు మాన్యము మాధనధాన్యసంపద

ల్లాయురె మోహమందిమది మాయవియందు మవెల్లమావియే
మాయన నీవె కావె మఱి మాయుత మీజగమెల్ల నిందిరా.

చ. సరసిజనేత్రి నీ వెపుడు చంచలవంచును సారెసారెకున్
దురితమనస్కు లెన్నుటను దుర్యశ మొక్కటి సంఘటించె ద
త్పరిహరణార్థమై స్థిరత దాసునియింట వసించుచుండినన్
బరగ నుతించి చాటెదను బాపుచు వయ్యపకీర్తి నిందిరా.

ఉ॥ ఎందున నీకటాక్షము లోకించుక బైబడకుండు నాక్షణం
బందు న దెల్లదుఃఖమయమవ్వా సిరులక్ష దులధూగు నాహరి

శ్చందురు డానలుండు నృపచంద్రుడు ధర్మజు డాదిగాగ ము
న్నెందరో ధీరవృత్తి జరియింపరె నీకృపలేక యిందిరా.

ఉ॥ ఆతతబ్రీతి నీ వెవని కాశ్రియమై వసియింతు వెప్పుడున్
ఆతడె పండితుండు నరు డాతడె సత్కులజాతు డాతడే
యాతడె జూడగ న్వీనగ నాతడె వక్త రసజ్ఞు డాతడే
మాత! భవద్విశేషమహిమం బది గాదె సమస్త మిందిరా.

చ॥ కరుణ దలిర్ప నేపురుషు గాంచి చరించెద వీ వతం డహో
పురుషవరేణ్యుడై భువనపూజ్యత గాంచు విశేషసంపదన్

ఉరమున నీవు ప్రేమభర మూని వసించుటచేత గాదె యా
హరికి బరాత్పరుం డనెడి యంచిత వైభవ మబ్బె నిందిరా.

ఉ॥ ఆపద కేది యడ్డపడు హస్తగతామలకంబురీతిగా
జూపు సమస్త మెయ్యది యశోవిభవాదిశుభాళి కెద్దియా
గాపుర మెద్ది గాంచినవె గల్గగజేయు భ్రమ న్విరాగికిన్
బ్రాపుగ నద్ది నీదగుకృపాత్మక మైనధనంబె యిందిరా.

ఉ॥ ఏనుగు నెక్కి యుండు నత డెంత మొఱుంగుచు గుక్క లడ్డినన్
దా నెటు లేగునో యటుల ధారుణి నీపదకంజయుగ్మముꣳ

మానుగ నాశ్రయించి మను మానవు డాపద లెట్టి వైనమున్
వాని నలక్ష్యతం గనడె వారిజనాభునిదేవి యిందిరా.

చ॥ పరులను గెల్వజాలు నిజబాహుపరాక్రమ మెంత యుండినన్
సరసవచోవిశాలగతి జాలగ విద్దెల నెన్ని నేర్చినన్
అరయ సుశీలధైర్యవినయాదిగుణావళు లెన్ని యున్న నీ
కరుణ యొకింత వానిపయి గల్గనిచో ఫల మేది? యిందిరా.

చ॥ సుతు డనుకూలతం గనడు సోదరు డించుక బల్కరింప డా
శ్రితులును జెంత రారు నిజసేవకు డొందు జికాకు నాదృతిన్

సతియును గారవించ దిల సంతస మొందరు తల్లితండ్రులున్
హితు డొసగండు దర్శనమునేని భవత్కృప లేక యిందిరా.

ఉ॥ సుందరు లెంద రుండినను సోదరబంధుతనూజసత్సుహృ
ద్బృంద మ దెంతయున్న వరవేషసుభాష లవెన్ని యున్న మే
నందము చందము గ్గలిగి యంగదృఢత్వ మ దెంతయున్న దా
బొందకయున్న నీకృపను భోగము లబ్బునె వాని కిందిరా.

ఉ॥ ఎవ్వని నాశ్రయింతు రిల నీప్రజ లెల్ల సధా విధేయులై
ఎవ్వడు పూజ్యుడై గరిమ నెంతయు గాంచు సభాంతరంబులం

దెవ్వనియాత్మకు న్వాత లోకింతయు గల్గ వహీనసంపదన్
ఎవ్వడు కీర్తి గాంచు నత డెప్పుడు నీకృపవాడు యిందిరా.

ఉ॥ నేరము లెన్ని జేసినను నీకృప యెంతయు గల్గియున్న-చో
నేరుపులై ముదం బొసగు నీకృప యించుక కల్గ కున్న-చో
నేరుపులోడ దా నెటుల నెమ్మి జరించినగాని ధారుణిన్
నేరముఁలౌచు నాపదల నిక్కముగా నొనగూర్చు నిందిరా.

ఉ॥ ఈక్షితి నీకటాక్షలవ మించుక గల్గినరాజలోకగ
ర్వేక్షణమాత్మనై ఖరి గణింపగబో మన మాదృశాళి పరి

త్యక్షత నీకటాక్షవిభవాళి నెఱుంగ వశంబె యాసహ
సాక్షివిధీశ్వరుల్ భవదపాంగకృతార్థులు గారె? యిందిరా.

ఉ॥ మంగళదేవతాభిదము మానుగ గల్గెను తొల్లి నీకు నే
సంగతిలేక, తావి గని సన్నుతి కెక్కెడు బూవుకై వడిన్
మంగళశబ్దవాచ్యుడని మానితు డయ్యె భవత్ప్రియుండు నీ
సంగతి బొంది కాదె నిను సంస్తుతి జేయవశంబె? యిందిరా.

ఉ॥ అమ్మ గణింపకమ్మ మదియం దపరాధము లాశ్రితుండ, నే,
నమ్మ మఱెవ్వరమ్మ నిను నమ్మిన పేదరికమ్ము జేర రా.

దమ్ము నిజమ్ము చూడ జగమంతయు నీవె గదమ్మ లక్ష్మి! శ్రీం
క్లీం మహనీయమంత్రవశగీ! కృప దర్శన మిమ్ము యిందిరా.

ఉ॥ అమ్మ భవన్మహామహిమ నారయ నిమ్మహిలో వశమ్మ వే
దమ్ముల కైననున్ బహువిధమ్ముల నీదుకృపారసమ్ము పై
జిమ్మి కడున్ బ్రియమ్మెసగ సేవల గొమ్ము సదా వరప్రదా
నమ్మున బ్రోవు నన్ను నిను నమ్మితి నెమ్మనమందు యిందిరా.

చ॥ అలసు నశౌచునింట బహుభాషనునింటను సందెవేళ దా
దలిసి పరుండునింట నతిదీనజనాదృతిలేనియింట దు

ష్టలహాము గల్గునింట బరుషంబులు బల్కెడువానియింట నో
కలిమిపడంతి నీ వెపుడు గానగరా వనియందు రిందిరా.

చ॥ ఇల ఘనవృష్టి సస్యచయ మెల్ల సమగ్రిత ముల్కలెత్తి స
త్ఫలము నొసంగుచందమున తావకదివ్యకృపాకటాక్షసం
చలనమునన్ సమస్తమగుసంపద వేడ్క నుదర్కలబ్ధినిన్
గలుగగజేయు నీశ్వరి జగజ్జననీ ఘనవేణి యిందిరా.

చ॥ సరసిజవాసినీ! సరసిజశ్రితపాణి! సుధీమణీమన
స్సరసిజచారిణీ! సరసిజాతదళాయతసుందరేక్షణీ

సరసిజజన్మునకు జ్జనని, సారసనాభమనోవిహారిణీ!
సరసిజజాండపాలనవిచక్షణి! రక్షణసేయు మిందిరా.

చ॥ అతిమృదుశీతముగ్ధమధురాభసమర్ధతలన్ భవత్తనూ
లత కొదగన్ సుధాశనిసురామణికల్పకవస్తుసార మా
హృత మమె నబ్ధిచే నన, మహిం ద్వదకృత్రిమదివ్యమంగళా
కృతి కెటు లోపు సృష్టికథ కేవలవర్ణన జేయ నిందిరా.

చ॥ వనజరజంబు లంటిన భవత్పద మోర్వదు చేటికావిలో
కనముల మేను వాడుగను, గంజము బట్టుట సాహసంబు నా

ధునివనమాలనూగుటయు దుర్భరమౌ నిక మోటుమాటల
ప్రణుతి నొనర్పజాలను భవన్మృదులోజ్జ్వలమూర్తి నిందిరా.

చ। శశిధరసారసప్రభవ శక్రముఖామరవంద్యనీయ సా
దృశమహిమాస్వరూపమును దివ్యజగత్త్రయసంప్రకాశమౌ
యశమును నీకృపాలవశతాంశమునైన నొసంగ కున్నచో
వశమటె యస్మదాదులకు వాకొని వర్ణనజేయ నిందిరా.

చ। ధరను భవద్దృగంచలసుధారస మెవ్వని జిల్కు వానికిన్
సిరులు సరస్వతీరతులు సిద్ధిసమృద్ధులు ధీధృతుల్ బహూ

కరణముతోఁ బరంపరలుగాఁగ వశంవదులై బ్రపూర్ణతం
బరగవె? యాదరింపుము యాపారకృపామతితోడ నిందిరా.

చ॥ తడయక నీకృపారసము ధారుణి నెవ్వని సోకుచుండు, వా
డడవుల శత్రుమధ్యమున, నంబుధియందున, దుర్గవాగ్నులం
బడినను బెక్కుయాపదల బాల్పడినన్ దగఁబ్రోఁతు వట్లు నన్
విడువక యాదరింపగదవే కరుణింపు విపన్ను నిందిరా.

ఉ॥ నీకృప లేకయున్న ధరణీశ్వరుడైన దరిద్రుఁ డాఁగదే,
నీకృప గల్గెనేని జననీ! నిరుపేదయు ధారుణీశుఁడౌ

నీ కెనయైన దైవతము నీఘటనాఘటనప్రభావమే
లోకములందు గానము సరోజదళాయతనేత్రి యిందిరా.

ఉ॥ కొందరు భాగ్యవంతులరు గొందరు పేదలు గొంద రజ్ఞులున్
కొందరు కోవిదుల్ మరియు గొందరు వీరులు గొంద రల్పులీ
చందముగన్ జగంబు సదసద్యుత మాటగనన్ సుతామరీ
బృంద! భవత్కటాక్షతదుపేక్షలనృత్యముగాదె యిందిరా.

చ॥ అనఘులునై మనోజనిభులై విభవాఢ్యులునై యశస్కులై
ధనికులరై దయాళురయి ధార్మికులై ఘనులై వదాన్యులై

మనుజవరేణ్యులై సతతమాన్యులరై స్థిరులై విముక్తులై
దనరెడువారు తావకపదద్వయి గొల్చినవారె యుండిరా.

ఉ॥ నిర్ధనులై నిరాశులయి నీచులునై కరుణావిహీనులై
వ్యర్థులునై క్షతాంగులయి వ్యాధినిబద్ధులరై వినష్టులై
స్పర్ధకులై వ్యథాత్ములయి పాతకులై భువి మ్రగ్గువారు నీ
యర్థ మెఱుంగలేక మదియం దిడకుండినవారె యుందిరా.

ఉ॥ ఊరును బేరులేక నరు డుర్వి జనించి భవత్కృపాంశమే
పార నొకింతయేని దనపై గలుగన్ బహుభాగ్యవంతుడై

చారువిశాలకీర్తి గని సత్కవిసంస్తవపాత్రుఁడై మహో
దారత దేజరిల్లునుగదా జననీ! నను బ్రోవు మిందిరా.

చ॥ ధనమె యశంబుగూర్చు నిల దైన్యము బాపును ధైర్య మిచ్చు నా
ధనమె వివేకముం మఱి ముదంబునొసంగును మానరక్ష నా
ధనమె యొనర్చు సత్సుఖము ధర్మము మోక్షము నిచ్చు నీవె త
ద్ధనమహితస్వరూపిణివి దాసునిపై దయజూపు మిందిరా.

చ॥ ఋణ మది హెచ్చె హారము రుచింపదు కంటికి గూర్కు
రాదు యా
జ్ఞనమున లేదు ధీరతయు రచ్చకు దెచ్చెను రాచకార్య మా
ధనకనకాదివస్తువుల తస్కరు లింట హరించి రిద్ది ని
న్ననిశము గొల్చుచున్న ఫలమా యిదియా కనికార మిందిరా.

ఉ॥ అప్పులు దీర్చలే ననెడియాతుర మందుచు నాటినాటికిన్
జెప్పతరంబుకాని వెతచే దిగు లందితి నిల్పవమ్మ నా
గొప్పతనం బనన్యగతికిన్ శరణాగతు నిట్టు లింక నన్
దిప్పలబెట్ట కీప్సితము దీర్చి కృపన్ వహియింపు మిందిరా.

చ॥ పడగలపాటులన్ బడిన బైనిపనాత్పరుడే గలం డటం
చుడుగక మత్ప్రయత్నముల నువ్విళులూరితి ధైర్యమింక నా
మెడ విడచెన్ గటా గడియయేని భరింపగజాల దుర్దశన్
దడయక జేరదీసి నను దైన్యము వాపి భరింపు మిందిరా.

ఉ॥ భక్తుల నుద్ధరింపగ భవత్పతి తద్ధనమున్ హరింప నా
సక్తి మెలంగు నీ వన నసచ్చరితాత్ములచెంత నెప్పుడున్
రక్తి వసింతు వయ్యయొ ధరాస్థలి నర్థములేకయున్న మీ
భక్తులు వ్యర్థులేకద కృపామతి నాపయి జూపు మిందిరా.

ఉ॥ పాయనిభక్తి నిన్నెపుడు బ్రస్తుతిజేయుచు నోరునొవ్వ కు
య్యో యభయార్థి నన్ బలుకుతో మొర బెట్టినగాని నీకు నా
ప్యాయత గల్గ దో నదియు, బాలకు లేడ్చినగాని తల్లి పా
లీయదొడంగునే కనికరింపుచు నిమ్మహిలోన నిందిరా.

ఉ॥ ఇమ్మహిలోన నిందనుక నెల్లవిధమ్ముల నాప్తబంధువ
ర్గమున దీసిపోక నుతి గాంచితి నమ్మరొ నీకృపావిశే
షమ్మున నన్ను నిత్తరిని సాకకయున్న జరించుటెట్లు పూ
లమ్మినయూరిలో పుడకలమ్ముట హేయముగాదె? యిందిరా.

చ॥ సకలజగన్నియంత పతి శౌరి, సుధానిధి కామధేనుక
ల్పకములు తోడుబుట్టువులు, భవ్యతనూజుడు సృష్టికర్త వే

రౌకసుతు డారతీశుడు నహా నిఖిలార్థసమృద్ధవయ్యె నీ
వికకృపణత్వ మూన తగుదే మదభీష్ట మొసంగ కిందిరా.

ఉ॥ నీ వలనాడు సీతవయి నేర్పుగ రాముని గూడి కానయం
దీవు వసించునాయెడల నగ్గొనరించిన కాకదైత్యునిన్
దేవి! భవత్ప్రియుండు బరిమార్పగ నెంచ గృపాంతరంగవై
కావు మటంచు వాని కుపకారము సేయగలేదె? నీదు దీ
నావనతత్పరత్వ మిపు డారయ నాయెడ జూపు మిందిరా.

చ॥ జనకుడుబోలె శౌరి యనిశం బపరాధుల బ్రోవు చెప్పుడే
మనమున గోపమూన నదిమాన్పగ నాథ! యిదేమినాయమిం
దనఘు డెవండు లోకమున నారయుమం చుచితోక్తి వాని నీ
వనయము శాంతు జేసి స్వజనాళిగ జేయవె వారి నిందిరా.

ఉ॥ శ్రీకరి! యావికుంఠనగరీ పతితో సరసంబు లాడుచో
నా కుశలప్రసంగము నొనర్చునె నీకడ నాత డంబరో!
మీా కెరిగించువా రెవరు? మేలొనగూర్పగ నింక దిక్కు నీ
వేకద? నా కనారత మివే పదివేలనమస్సు లిందిరా.

ఉ॥ తల్లికి దండ్రికంటె నిల దద్దయు బ్రీతిగదే ప్రజాళిపై
నెల్లవిధంబులన్ వెత హరింపగ మాయపరాధముల్ సదా
యుల్లమునన్ క్షమింప విభవోన్నతులన్ గలిగింప బెంప నో
తల్లిరో! నీకె చెల్లు నిటు దాల్మి వహింపక బ్రోవు మిందిరా.

చ॥ తనదుపురాకృతంపుసుకృతంబున సంపద నొంద గల్గు నం
చనియెద రిందు గొంద రిక నంబ నిను న్వినుతించు నాత డెం
దున దులదూగు సంపదలతో నని నే ధృతిబూని సన్నుతిం
చిన నను బ్రోవకుందువె విశేషకృపామతి బ్రోవు మిందిరా.

చ॥ ఇది కలికాల మిం దొక డనేకవిధాననియుక్తి నిశ్చలం
బౌదవెడు భక్తిని గ్గొలువ నోప డవశ్యము కామ్యయో
గమా
తుది గన దంతరాయమున ద్రోవ లనేకము లుండు భక్తిలో
నుదయము జేయ నీవెకద యోరమ దిక్కుక మాకు నిందిరా.

చ॥ సమదమతంగజాళియును సత్తురగావళులుఌ రథంబులుఌ
సమరకళైకసాధనవిచక్షణయోధవతంసవారముల్
సమధికరత్నకాంచనలసద్గృహ భూమిసతీసుతాదియో
గము భవదర్చనంబుననుగాదె? లభించు ధరిత్రి నిందిరా.

చం॥ నెనరది యింతలేని యవినీతుడ నౌట యథావిధిం ద్వద
ర్చనలను సల్పనెంతయును జాలుదునే దగలోకమందు నఘ
మనుజులబంధముక్తులకు మానసమేగద హేతు వౌట నా
మనమున నిల్పి నిన్నిపుడు మానసికార్చన జేతు నిందిరా.

ఉ॥ మానిత విస్ఫురత్ఫలనుమవ్రజ దానవిరాజమాన సం
తానలతాపరీకృత నితాంత లసద్భవాదివ్యపాదపా
ధీన మధువ్రతీ వరభృతీ లలితశ్రుతి సౌఖ్యద స్వనో
ద్యాన విహారకేళినిరతా సరితాంపతిజాత యిందిరా.

# మానసిక పూజ.

ఉ॥ ఓజననీ కృపాభరణి యోవరలక్ష్మి జగత్కుటుంబినీ!
ఓజనతాఘ తాపహారి యోమురవైరిమనోహరీ రమా!
ఓజగదేకమోహిని పయోనిధికన్యక లోకమాత ని
ర్వ్యాజకృపాత్మ నాదుహృదయాబ్జమున న్వసియింపు మిం
దిరా.

చ॥ సలలితమందహాసయుత చారుముఖాంబుజ భాసురత్కృపా
కలితకటాక్షవీక్షణ వికాసితమంజుల గండభాగ సం
చలిత సుకర్ణభూషణ విశాలధగద్ధగితద్యుతుల్ భువిన్
జెలగగ రమ్మ చిత్తమున జేసెద నావహనమ్ము యిందిరా.

చం॥ ఘనతవికుంఠధామ వరకల్పకమూలవిరాజమాన కాం
చనవరపీఠి నొప్పుచును సర్వదిగీశ్వరకామినీమణుల్
వినతి సపర్యలన్ సలుప విశ్వవిమోహనదివ్యమూర్తివై
దనరెడు యాదిలక్ష్మివని ధ్యానమొనర్చెద భక్తి నిందిరా.

చ॥ మరకతతోరణావళులు మౌక్తికచిత్రిత రంగవల్లులన్
బరిమళయుక్తధూపములు భవ్యమణీమయదీపికావళుల్
బరగెడు మంటపంబునను భర్మవినిర్మితసింహపీఠిపై
స్థిరత వసింపు మందముగ సిద్ధము జేసితి నిందు నిందిరా.

ఉ॥ పూతపసిండిపాత్రమున బొందుగ నుంచిన పారిజాతకా
బ్జాత సుకేతకీ వకుళ చంపకసూన సువాసితంబు నా
శీతలనిర్మలోదకము జేరగ దెచ్చితి నీదుపాదకం
జాతయుగమ్మునం గడుగ జక్కనిపాద్యముగొమ్ము యిందిరా.

చ॥ వికచమనోజ్ఞ పుష్పచయ విస్తృతవాసన లేలకీ లవం
గక మృగనాభి సంమిళిత కర్పురచందన సౌరభంబులన్
బ్రికలితమై సెలంగు నతిపావనతోయము నబ్జపాణి నీ
విక నెద స్వీకరింపగదె యిచ్చెద నర్ఘ్యము తల్లి యిందిరా.

ఉ॥ చంచదనర్గళాతిశయ చంచలవీచి లసద్వియత్తటి
న్యంచితమై మనోజ్ఞమయి యద్భుతమై త్రిజగత్పవిత్రమై

మించియు ముంపులీల తగమేలగు చల్లనిదివ్యతోయ మం
దించెద నే గ్రహింపు కమలేక్షణ యాచమనీయ మిందిరా.

ఉ॥ వేమరు పున్నమందయిన వెన్నెలగేరెడు శోభ గల్గి శ్రీ
భామిని! మంచియావువగుపాల్పెరుగుల్ నవగోఘృతంబు గా
రాముగ జుంటితేనె గడురంజిలు చక్కెర గూర్చినట్టి పం
చామృతము ల్ముదంబున సమర్పణ జేసెద గొమ్ముయిందిరా.

చ॥ భువనములందు నెల్ల గడుపూజ్యములై యఘనాశనంబులై
నవఘనసార గంధమృగనాభిముఖాధికవాసితంబులై

భువి మణిహేమకుంభపరిపూర్ణములై తగునిర్మలంబులౌ
వివిధసుతీర్థతోయము లివే యభిషేక మొనర్తు నిందిరా.

చ॥ అరయ ననర్ఘదివ్యధవళాంశుకము న్గనకోత్తరీయమున్
సురుచిరరత్నకంచుకము శుభ్రితరోజ్వలమౌక్తికావళీ
విరచితయజ్ఞసూత్రిమును విస్తృతభక్తి మదిం దలంచి త
త్పరతనొసంగినాడ దయదాల్చి ముదంబొనగూర్చుమిందిరా.

చ॥ మణిమయ నూపురద్వితయ మంళసూత్రి కిరీట హార . కం
కణచయముర్మ, శిరోమణియు, గాంచన మేఖల దివ్యకర్ణభూ

షణయుగ మాదిగా వివిధచారుతరాభరణంబులన్ ధరన్
గణుతి వహింప నీలలితకాయ మలంకృతి జేతు నిందిరా,

ఉ॥ వరఘనసార కుంకుమసువాసితగంధ మలంది మేన క
స్తురితిలకంబు ఫాలమున శోభిలగూర్తు శుభాంజనం బిదే
తరళదృగంచలంబులను దాల్పవె, రోచనపత్రికంబులన్
సురుచిరగండభాగముల సొంపొనగూర్చెద నమ్మ యిందిరా,

ఉ॥ మరువక మల్లికా వకుళ మాలతి చంపక పారిజాత తా
మరస రసాల కేతకి సుమంబుల నీతులసీదళంబులన్

బరగ సహస్రనామముల భక్తియుతంబుగ బూజజేతు శ్రీ
కరభవదంఘ్రిపంకజయుగద్వయిపై మది నిల్పి యిందిరా.

భాసురచందనాగరు సువాసిత గోఘృతమిశ్రితంబు శ్రీ
వాససితాభ్రముఖ్యబహు వస్తుయుతంబగు దివ్యధూపమున్
శ్రీసతి! కల్పనం బమరజేసితి మామకచిత్తవృత్తి వి
శ్వాసముతోడ గైకొను మవార్యయశస్సువికాస యిందిరా.

చ: సరసిజపాణి, నీమదికి సంతసము న్గలిగింప నెంతయున్
సురుచిరరత్నమండప సుశోభిత చిత్రహిరణ్యపుత్రికా

కర ధృతమాలికాకృతి వికాసితముల్ ఘృతవర్తితంబులౌ
స్థిరతరదీపికావళుల చిత్తమునన్ సమకూర్తు నిందిరా.

చ॥ ఫలములుబానకంబు వడపప్పును బాల్పెరుగు ల్ఘృతంబునున్
బొలుపగు సూపశాకము లపూపములు న్సరసాన్నముల్ పొం
గలి, పులిహోర పాయసము గాంచనపాత్రలఁగూర్చి తమ్మ నీ
వలరుచు నారగింపగదె యాదరభావము బూని యిందిరా.

ఉ॥ మేలగువక్క లేలకులు మె ప్పొనరించెడు పండుటాకులుం
జాలిన పచ్చకప్పురము చక్కనిముత్తెపుసున్న మెన్న త

క్కోలలవంగముఖ్యముల గూర్చి సమర్పణ జేసినాడ తాం
బూల మిదే జగజ్జనని! బొందుగ వీడెముసేయు మిందిరా.

ఉ॥ రాజముఖాఽమరాఽజసుర,రాజ కిరీట మణిప్రభాళి నీ
రాజితపాదవై సతము రాజిలు తావక దేహవల్లికిన్
రాజస మొప్ప సంతతవిరాజితకర్పూరదీపరాజి నీ
రాజన మిత్తు నంబ రతి,రాజునకుం జనయిత్రి యిందిరా.

చ॥ మణిగణమిశ్రితంబు ఘనమౌక్తికకాంచనసంచయంబు ద
క్షిణగ సమర్పణం బొనరజేసెద నీశ్వరి! మత్పురాకృతా

ఘనిచయ మెల్ల దోఁచి నను గావ దివారము నీ కిదే ప్రద
క్షిణము ప్రణామకోటులను జేసెద నాదృతి గొమ్ము యిం
దిరా.

చ॥ మతి నతిభక్తితోడ నిను మానసికార్చన జేసినాడ స్వీ
కృతి నొనరించి లోపముల నెల్ల గృపన్ క్షమియించి నన్ను స
త్కృతునిగ నెంచి నీదగుమతిన్ బరిపూర్ణముగా దలంచి సం
తతము మదీయచేతమున దద్దయు బ్రీతి వసింపు మిందిరా.

చ॥ పెన్నిధిగన్నయట్టి నిరుపేదవిధంబున మోద మందగా
నెన్నడు నే నొనర్చితినొ యెక్కుడుదానము లేతపంబు లిం

కెన్నగ నాపురాకృతము లెట్టివొ నీమహనీయరూపముం
గన్నులకోర్కెదీరగను గాంచితి ధన్యుడనైతి నిందిరా.

ఉ॥ ఎప్పుడు లభ్యమౌనో భవదీయకృపారసము స్మహౌషధం
బప్పుడె దుర్దశామయ మదంతయు బోవును లోకమాత! నా
కెప్పటికిం దదామయము నింక ఘటింపగ జేయకమ్మ నే
నొప్పుగ నీపదాంబురుహయుగ్మము నౌదల దాల్తు నిందిరా.

ఉ॥ మంచితనంబు గాంచి మది మానవజన్మము వ్యర్థమౌట నూ
హించి భవాంబుధివ్యథ వహించి సతంబు వృథాభిమానముం

డించి నుతించి యీశ్వరునిలీలల నిన్ బరదేవి వంచు జిం
తించి తరించు నిశ్చయమతిన్ బరమార్థవిదుండు యిందిరా.

ఉ॥ ఆశకు మేరలేదు పరమార్థ మెఱుంగగ రాదు దుర్మదా
వేశము తీరలేదు మరివిజ్ఞులసంగతి లేదు సంసృతీ
పాశము వీడబోదు గొలువన్నిను శక్యము గాదు త్వత్కృపా
లేశ మదైన నాకికను లేనియెడన్ దెర వేది యిందిరా.

చ॥ నిలుకడ లేదు చిత్తమున నేరుపుసున్న వివేక మందునా
గలుగదు సూనృతం బదియు గానగరాదు సువిద్య లన్ననో

తలప హుళక్కి గౌరవము దబ్బర శాంతము సాస్తి నిన్మదిన్
దలచెద లోప మెంచ కిక దాసుని బ్రోవవె ప్రీతి నిందిరా.

ఉ॥ ఇంచుకవచ్చిరాని నుడి నెద్దియొ గోరుచు బోరు బెట్టగా
నంచితరీతి మాత మది నారసి పాపని నూరడించు న
ట్లెంచగ భావగుంభరసహీనవిరూపము లౌట నానుతుల్
వించు మనోగతం బెఱిగి పెంచుము నన్ శరణార్థి నిందిరా.

చ॥ సిరు లవి గల్గు నీదుపదసేవ నొనర్చినమానవాళికిన్
దురితము లంటరావు మఱిదుర్దశ బోవు నటంచు నాత్మలో

నురుతరభక్తి నీవిలసితోత్పలచంపకమాలికావళిన్
స్థిరముగ దాల్ప వేడితి నిదే భవదర్పణ జేసి యిందిరా.

చ॥ అలరగ శాలివాహనశకాబ్దము వార్ధిశరేభభూమిసం
ఖ్యల దనరారు నాంగిరసహాయన పౌష సిత త్రయోదశీ
విలసితసోమవారమున విస్తృతభక్తిని బూర్తి జేసి ని
ర్మలమతి నీకు నీశతకరాజ మొసంగితి నంబ యిందిరా.

ఉ॥ మంగళ మాదిలక్ష్మి కిదె మంగళ మబ్జదళాయతాక్షికిన్
మంగళ మీశ్వరేశ్వరికి మంగళ మచ్యుతచిత్తహారికిన్

మంగళ మబ్ధిరాట్సుతకు మంగళమా జగదేకమాతకున్
మంగళ మబ్జమందిరకు మంగళమాగదె నీకు నిందిరా.

ఉ॥ ఈమహితేందిరాశతక మెవ్వడు భక్తి బఠించు సంతతం
బామనుజాగ్రగణ్యుగృహమం దెపుడున్వసియించి సత్కృపన్
కామితదివ్యవైభవ సుఖస్థితి నైహికపారలౌకిక
క్షేమము లాదృతిం గలుగజేయుచు నిందిర వానిబ్రోచెడున్.

ఉ॥ స్వస్తి సమస్తమా ప్రజకు సంతతము న్గణుతింప న్యాయమా
ర్గస్థులపై నృపాలురు ధరాస్థలి బ్రోతురుగాత బ్రీతితో

నిస్తులమౌ శుభం బగుత నిత్యము గోగణవిప్రజాతికిన్
విస్తరసౌఖ్యసంపదల విశ్వము దా దులదూగు గావుతన్.

మ॥ పరమప్రీతిని నిల్పు శ్రీమదనగోపాలాంఘ్రినిత్యార్చనా
గురుశీలుండును గౌతమప్రవరుడున్ గోవర్ధనోపాఖ్యుడున్
వరవైఖానసవైదికోత్తముడు గోపాలార్యసూనుండు ని
ద్ధర శ్రీరంగసమాఖ్యుచే నిది ప్రణీతం బయ్యె సంపూర్తిగన్.

సంపూర్ణము.

# దండకము.

శ్లో॥ శ్రీవైకుంఠపురీసురద్రుమవనే చింతామణీవేదికే
పార్శ్వే పద్మకశంఖముఖ్యనిధిభిః బ్రాహ్మ్యాదిభి ర్మాతృభిః
ప్రాప్త్యాద్యష్టవిభూతిభి స్త్వభినుతే పద్మాసనస్థే రమే
చిచ్ఛక్తిపరదేవతే సతతమోం శ్రీం క్లీం శ్రియై తే నమః.

శ్రీమద్ర్యమామాసినీ, మానినీసౌఖ్యసంధాయినీ, విశ్వసంమోహినీ,నిత్యకల్యాణి,లోకైకమాతా, దయోపేతక్షీరాబ్ధిసంజాత, కంజాతహస్తే, సమస్తంబు నీచేతి దీచేత నాచేతనానీకలోకంబు నేలాగు జేయంగ నూహించి తాలాగునం జేయగ౯

నీ కసాధ్యంబు లే మున్నవో దేవి, నీయాజ్ఞలే కున్న నాకైన
నల్లాడదో యాదిశక్తీ! భవచ్ఛక్తినాసక్తి నెంచంగ నేనెంతసద్భక్తి
నాయోపినంత న్నుతింతున్ గటాక్షింపవే తావకానూనకారుణ్య
కీ దృక్ప్రసారాంశ విన్యాసలేశం బ దెవ్వానిపై సోకు నాతండె
వీరుండు, శూరుండు, ధీరుం దుదారుండు, మాన్యుండు,విద్యా
వయోరూప సంపత్ప్రభానాగ్రగణ్యుండునౌ, వానికిఁ ది
వ్యకేళీగృహారామ గో భూ సతీ పుత్ర మిత్రాదియోగంబు
లెన్నేనియుం గల్గి సాయుజ్య సామ్రాజ్య సౌఖ్యంబు హస్తంగ

తం బా గదే, ఇందిరాసుందరీ! త్వత్కృపావేశ మింతైన లేక ను
న్న ము న్నెందరో సర్వసర్వంసహాధీశ్వరుల్ గర్వముల్వీడి యా
పన్నులై రోగులై, జోగులై, చింతలం బొందగా లేదె,
ధాత్రిన్, నరుల్ గొంద రెంచన్ నిరుద్యోగులై, రాగులై,
రోగులై, పాపులై, కోపులై, హీనులై, దీనులై, జారులై,
చోరులై, భీరులై, పేదలై, మోద మింతేనియున్ లేక ఖేదం
బుల, బొందుటన్, జూడగన్, బూర్వజన్మంబునందైన, యుష్మ
త్పదాబ్జ ద్వయీసేవ నింకైన గావించకే గాదె! మాతా!
మదీయాపరాధంబులన్ సైచి మాకోర్కెలన్ దీర్చి మాయా
పదల్ రెప్పచందాన బాలింపవే, తల్లికిం దండ్రికిం బెన్, బ్రి

జాపాళిపై, కూర్మిబాహుళ్యమా గాదె, దేవీ! సదా సుస్థిరత్వం బుతో, దాసునింటన్ వసింపంగ, నిన్నే మది న్నమ్మి, యున్నాడ, మూఘుండ, సంసారతాపత్రియాధీనుడన్, దీనుడన్, బ్రోవవే, యాదిలక్ష్మీ! మహాదేవి! శ్రీం క్లీం మహామంత్రమూర్తీ, దయాపూర్తి, తల్లీ, నమత్కల్పవల్లీ! నమస్తే, నమస్తే నమః॥

శ్రీ. శ్రీ. శ్రీ.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 9 | సౌకుసుమా | సౌకుమా |
| 10 | 2 | అవహితవై | అవహితలై |
| 13 | 6 | నిజేభ | నిజేఛ |
| 15 | 1 | దుద్వార | దుర్వార |
| 15 | 8 | జగధీ | జగదీ |
| 19 | 3 | త్కృపామతము | త్కృపామృతము |
| 19 | 8 | ధంబిడ | ధంబిడి |
| 20 | 4 | ల్దగిలి | న్దగిలి |
| 23 | 2 | ధీరవృత్తి | దీనవృత్తి |
| 29 | 2 | క్లీంము | క్లీమ్ము |
| 31 | 4 | సుధాళని | సుధాళి |

2

| | | | |
|---|---|---|---|
| 33 | 2 | యూపా | యపార |
| 39 | 3 | లేడ్చిన | డేడ్చిన |
| 39 | 6 | గ్గమున | గ్గమ్మున |
| 44 | 6 | కృత | వృత |
| 55 | 8 | వహించి | సహించి |
| 57 | 5 | నాతుల్ | నుడుల్ |
| 61 | 5 | శ్రీమద్ర్యమా | శ్రీమద్రమా |
| 63 | | బులబొందు | బులన్ : ొందు |
| 63 | 8 | నిండైన | నిండైన |
| 63 | 10 | దల్ రెప, | దల్ దొ్రచినఁ గంటి ఁ రెప్ప |